కుటుంబస్థాయిలో ప్రేమ, అనురాగం అనే పేరుతో సేవలు, పిల్లలకు వృద్ధులకు వేతనం లేని స్త్రీల శ్రమ ద్వారా తీర్చబడు తుంటాయి. స్త్రీల నైపుణ్యాలు సమాజపరంగా అందరికీ అందాలి. స్త్రీ కుటుంబంలోను, ఆర్థిక స్వావలంబనం కోసం జీతంకోసం పని చేయాలి. పిల్లల్ని పెంచడంలోను, విద్యాబుద్ధులు నేర్పించడం లోను ఆమెకున్న నేర్పరితనాన్ని ఆర్థిక రాబడి రూపంలోనికి మార్చు కుంటేనే స్త్రీకి, స్త్రీ జీవితానికి విలువ.

మరి ఆమె పిల్లల సంగతి, ఆమె ఇంటిలోని వృద్ధుల సంగతి ఏమిటి? అనే ప్రశ్నకు సమాధానం శిశు సంరక్షణాలయాలు, వృద్ధాశ్రమాలు విస్తృతంగా స్థాపించడం, ఆర్థిక వ్యవస్థను సామా న్యుడికి అర్థం కానంత క్లిష్టంగా మార్చివేసి భార్యాభర్తలిరువురూ జీతంకోసం పనిచేయకపోతే కుటుంబం కుప్పకూలిపోతుంది అనే భయాన్ని సృష్టించి వ్యాపార సంస్కృతిని పెంచి పోషించడం.

ఇదీ క్లుప్తంగా చెప్పాలంటే మన దేశానికి వలస వచ్చిన యూరో పియన్ నాగరికత.

బ్రిటిష్ వారి కాలంలో భారత స్త్రీని "White Women's burden" గా స్వీకరించి ఈ దేశంలో అడుగు పెట్టిన మేరీ కార్పెం టర్, (1807-1977), ఎన్నెత్ ఎక్రాయిడ్ బెవరెడ్జ్ (1842-1929), మార్గరెట్ క్యూజిన్స్ (1878-1954), ఎలియనార్ రాత్ బోన్ (1872-1946) మొదలైన సాంస్కృతిక మిషనరీలుపై నేపథ్యంతోనే స్త్రీల స్థితిగతులని అర్థం చేసుకున్నారు.

కుటుంబంలో భర్త, పిల్లల సేవలో మునిగి ఉన్న స్త్రీలు వీరి దృష్టిలో ఆర్థిక స్వావలంబన లేని అబలలు. వీరి దృష్టి అంతా బాల్యవివాహాల మీద, బాల వితంతువుల మీద, వితంతు వివాహాల మీద, స్త్రీల సంతానోత్పత్తి మీద కేంద్రీకరింపబడేది. పుంఖాను పుంఖాలుగా భారత స్త్రీల దయనీయ స్థితి మీద గ్రంథాలు రచించ బడ్డాయి. అవగాహనారహితమైన విమర్శలు చేయబడ్డాయి.

యూరప్ నుండి వచ్చిన ఈ స్త్రీలలో చాలామంది రాజా రామ మోహన్ రాయ్, మన్‌మోహన్ ఘోష్, కేశవచంద్రసేన్, స్వామి వివేకానంద మొదలైన భారత సంఘసంస్కర్తల ప్రభావానికి ప్రభా వితులై వచ్చినవారే. వీరిలో పలువురు అవివాహితులు. ప్రొటెస్టెంట్లు, పైగా సాహసోపేతమైన సవాళ్ళను స్వీకరించే మనస్తత్వంతో వారి వారి దేశాలలో పురుషాధిక్య భావజాలాన్ని తట్టుకోలేని పరిస్థితులలో భారతదేశానికి వచ్చినట్లు కొన్ని అధ్యయనాలలో పేర్కొనడం జరిగింది.

కొన్ని వేల సంవత్సరాల చరిత్ర కలిగిన భారతస్త్రీ హృదయాన్ని వారు పైపైన మాత్రమే స్పృశించగలిగారు. సంస్కరణ పేరుతో సంప్రదాయాల్ని కూలగొట్టాలనే విఫల ప్రయత్నం చేశారు.

**ఇక యూరప్‌లో ముఖ్యమైన క్రైస్తవ మతాన్ని చూస్తే సృష్టి క్రమాన్ని వర్ణిస్తూ పురుషుని ప్రక్క ఎముక నుండి స్త్రీ తయారుచేయబడిందని, ఆమె కుత్సిత బుద్ధి వలన పురుషుడు నిషేధించబడిన ఫలాన్ని భుజించాడని చెప్పబడింది. ఆ విధంగా పాపం అనేది స్త్రీతోనే ప్రారంభమైనట్లుగా వర్ణించబడింది.**

16,17 శతాబ్దాలలో మత వ్యవస్థకు, రాజకీయ వ్యవస్థకు మధ్య అధికారానికై వారిలో 90% స్త్రీలే ఉన్నారు. వీరిలో ప్రసిద్ధిచెందిన జోన్ ఆఫ్ ఆర్క్ ఒకరు. జాతీయ రాజ్యం ఆవిర్భావం తరువాత రాజ్యమే ధర్మ నిర్ణేత అయింది. ప్రాచీన కాలంలో ప్రసిద్ధి చెందిన మన మైత్రేయి, గార్గి వంటి పూజ్యనీయులైన మహిళలు యూరప్ చరిత్రలో మనకెక్కడా కానరారు.

ప్రజాస్వామ్య విధానాలు, ఆధునిక పారిశ్రామిక విధానాలు, వాణిజ్య పోకడలు దాదాపు ఒకేసారి యూరప్‌ని ప్రభావితం చేశాయి. ఈ నేపథ్యంలో వ్యక్తులందరూ వారి సహజ తత్త్వాన్ని ఏమరచి పౌరులుగాను, కార్మికులుగాను, వినియోగదారులుగాను పునర్ వ్యవస్థీకరించబడ్డారు.

ఈ వ్యవస్థలు మూడింటిలో కుటుంబం, వ్యక్తులు సంక్షేమ పథకాలకు లక్ష్యాలు మాత్రమే. స్త్రీలను కుటుంబం నుండి ఎంత దూరం చేస్తే పై వ్యవస్థలకు అంతలాభం చేకూరే పరిస్థితి నెలకొంది. అయితే ఇటు కుటుంబ బాధ్యతలను పోషిస్తూ, అటు కుటుంబేతర సంస్థలలో పాల్గొనడానికి స్త్రీలు విపరీతమైన ఒత్తిడికి గురైనారు.

కొందరు స్త్రీ మేధావులు ఈ పరిస్థితులపై అధ్యయనాలు, విశ్లేషణలు కూడా చేశారు. మేరీ వూల్ స్టోన్ క్రెఫ్ట్, సైమన్ ద బవూ ఆర్ వంటి యూరోపియన్ స్త్రీ మేధావులు ఇలాంటి కృషి చేసి సమాజం చేత Female Eunuch's గా బహిష్కరించబడ్డారు. మరీ ఆధునిక కాలంలోకి వస్తే కొన్ని ఫెమినిస్టువాదాలు తప్పి విచ్చలవిడి శృంగారం, విచ్చలవిడి వస్త్రధారణ, కుటుంబ బాధ్యతలకు పూర్తి విముఖత చూపించడంలాంటి నినాదాలతో ఉద్యమించారు.

ఇదే నేపథ్యంలో ఆధునిక స్త్రీవాదం మనదేశంలో అడుగుపెట్టింది. స్వాతంత్ర్య సమరంలో స్త్రీలు తమ వంతు పాత్రను పోషించడం మనకందరికీ తెలుసు.

గాంధీజీ వంటివారు ప్రశంసించిన సీత, సావిత్రి వంటి ఉదాహరణలను, మాతృత్వపు ప్రాధాన్యతను స్త్రీ వాదులలో కొందరు విమర్శించడం ప్రారంభించారు.

కొందరు స్త్రీ వాదులు యూరప్, అమెరికాల నుండి స్ఫూర్తి పొందితే మరికొందరు రష్యా, చైనా వంటి కమ్యూనిస్ట్ దేశాల నుండి ప్రేరణ పొందారు. విద్య, ఉపాధి, స్వేచ్ఛ, కుటుంబ బాధ్యతల నుండి ఉపశమనం వంటి అంశాలలో పెద్దగా ఆలోచనా వైవిధ్యం లేకపోయినా సూక్ష్మమైన అంశాలలో అనేక అసంబద్ధతలు, వైరుధ్యాలు చోటుచేసుకున్నాయి.

1975 అంతర్జాతీయ మహిళాదశాబ్దిగా ప్రకటించిన నేపథ్యంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనేక మహిళా సంక్షేమ పథకాలతో మహిళా ఓటర్లను ఆకర్షించడం మొదలుపెట్టాయి. చిత్తశుద్ధి లేని కొన్ని చట్టాలు ఆచరణలో విఫలమైనాయి. పారిశ్రామిక రంగం స్త్రీల శారీరక, మానసిక ఆందోళనలను, అభద్రతా భావాలను ఆధారంగా తీసుకొని అసాంప్రదాయిక, అశ్లీల ధోరణులను సృష్టించి పెంచి పోషిస్తున్నది. దీనిగూర్చి పెద్దగా విశ్లేషణ కూడా అవసరం లేదు.

ఒకప్రక్క అద్భుతమైన తెలివితేటలతో, నైపుణ్యాలతో స్త్రీలు రాణిస్తున్న సందర్భాలు కన్పిస్తుంటే మరోప్రక్క ఇంట, బయటా కనీస రక్షణకు కూడా నోచుకోని ఉదంతాలు వినిపిస్తున్నాయి. ఆర్థిక స్వేచ్ఛ ఉండి కూడ అత్మసంతృప్తి లేని మహిళలు, పురుషాధిక్య విలువలతో సమతుల్యాన్ని కోల్పోయి పరిసరాల ఒత్తిడికి మనోధైర్యాన్ని కోల్పోతున్న పరిస్థితులు నానాటికీ పెరుగుతున్నాయి.

**భార్యాభర్తల మధ్య అవగాహన లోపం ఫలన విడాకుల పేరుతో రోడ్డున పడే దంపతుల సంఖ్య పెరగటం కన్పిస్తుంది. ఈ అస్తవ్యస్త పరిస్థితులలో అధికంగా నష్టపోతున్నది ఈ తరం బాలబాలికలు. తమకు మార్గదర్శకులుగా ఉండవలసిన తల్లిదండ్రులే ఆందోళనా భరితమైన జీవితాలు గడుపుతుంటే వారికి దిక్కెవరు?**

దిక్కు మేం చూపిస్తామంటూ ప్రచార సాధనాలు, సలహా కేంద్రాలు తయారై ఒకరితో ఒకరు పోటీ పడుతూ, యువతీ యువకులను విశృంఖలంగా, నిర్వీర్యంగా తయారుచేస్తున్నాయి.

**అందుబాటులో ఉన్న అవకాశాల కోసం ఆరాటపడ్డం కాదు, అసలు నేనీ ప్రపంచంలోనికి ఎందుకు వచ్చాను, నా ఆత్మ సంతృప్తికి కావలసినదేమిటి అని భారత స్త్రీ తనను తాను ప్రశ్నించుకోవలసిన సమయం ఆసన్నమైంది.**

అయితే భారతదేశంలో బ్రిటిష్ వలసలకు ముందు స్త్రీల పరిస్థితి అత్యద్భుతం అని అనడం కాదు మన ఉద్దేశం. సృష్ట్యాది నుంచీ దేశకాల పరిస్థితులలో ఎన్నో మార్పులు, చేర్పులూ జరుగుతూ వచ్చాయి. మన ధర్మశాస్త్రాలలో కూడా కృతయుగం మినహా మిగిలిన అన్ని యుగాలలో అధర్మం ఆయా పాళ్ళలో చోటు చేసుకున్నట్లు ఉటంకించబడింది. బలవంతపు వివాహాలు, గృహహింస, స్త్రీలపై అత్యాచారాల వంటి వాటిని సమర్ధించే మూర్ఖులెవరు ఉండరు. అయితే ఒక సమస్యకు పరిష్కారం దొరికినట్లు కనిపిస్తే, మరొక పది సమస్యలు తలఎత్తే పరిస్థితి కూడా మనందరికీ అనుభవంలో తెలిసిందే. ఇప్పుడు మనం తరచుగా సాధారణ చర్చల్లో వినిపించే అంశాలపై దృష్టి సారిద్దాం.

సాధారణంగా స్త్రీ వాదులందరూ మనుధర్మశాస్త్రంలోని ఈ క్రింది అంశాలను స్త్రీ వ్యతిరేక భావాలుగా చిత్రిస్తూ ఉంటారు.

**1. పతిం యా నాభి చరతి మనో వాగ్దే హసంయతా**
**సాభర్త్ర్ప లోకానాప్నోతి సద్భిః సాధ్వీతి చోచ్యతే.**

**2. పితారక్షతి కౌమారే భర్తా రక్షతి యౌవనే**
**రక్షంతి స్థావిరే పుత్రా న స్త్రీ స్వాతంత్ర్య మర్హతి.**

**3. కార్యేషు దాసీ కరణేషు మంత్రీ భోజ్యేషుమాతా శయనేషు రంభా**



మొదటి అంశం స్త్రీ పాతివ్రత్యం. స్త్రీ పతివ్రతగా ఎందుకుండాలి అనేది ప్రశ్న.

ఎందుకు ఉండకూడదు అనేది కూడా ప్రశ్నే కదా?

దేశాన్ని ప్రేమించి, దేశం కోసం ప్రాణాలర్పిస్తే ఎంతో హర్షిస్తాం. ఫలించని ప్రేమ కోసం ప్రాణాలర్పించుకున్న లైలా, మజ్నూలను కూడా ఆహా ఓహో అంటున్నారు. మరి శాస్త్ర విధిలో వివాహం చేసుకున్న పతిని దైవంగా తలచి సుఖమైనా, దుఃఖమైనా అతడితోనే అనే వ్రతం పూనడంలో తప్పేమిటి?

ధర్మం చెప్పిందని కాదు, సహజంగా కొందరిలో ఆ పాతివ్రత్య భావన ఉంటుంది. మరి కొందరు ధర్మానికి, సంఘానికి భయపడి భర్తతో కలసి ఉండవచ్చు. ఇది అన్ని విషయాల్లోనూ వర్తిస్తుంది. చట్టంతో సంబంధం లేకుండా కొందరు ధర్మపాలన చేస్తారు.

కొందరు అధర్మం చెయ్యాలని ఉండీ, శిక్షకు భయపడి ధర్మానికి కట్టుబడతారు. నేను పతివ్రతను లేక పతివ్రతగా ఉండేందుకు ప్రయత్నిస్తాను అనుకోవడం సిగ్గు పడవలసిన విషయం ఏ మాత్రం కాదు. దీన్ని ఆదర్శంగా పెట్టుకోమని మన యువతరానికి చెప్పి తీరాలి. అలా ఉండడంలో పరలోకంలోనే కాదు, ఇహలోకంలో కూడా ప్రయోజనాలున్నాయని వివరించాలి.

భర్తలో ఉన్న లోపాల పట్టికను వల్లెవేసే ముందు, తనలో ఉన్న లోపాలను కూడ పరిశీలించుకోమని చెప్పాలి. లోకంలో ఎవ్వరూ

లోప రహితులు కారు. ఎంతమందితో సర్దుకోకపోతే ఈ జీవితం కడతేరుతుంది. ఒక వ్యక్తిని జీవిత భాగస్వామిగా స్వీకరించినపుడు (అది పెద్దలు చేసిన వివాహం కాని, ప్రేమ వివాహం కాని) ఎన్ని ఒడుదొడుకులు వచ్చినా సహనంతో సవాళ్ళుగా స్వీకరించడం వివేక మైన పని.

మన శాస్త్రంలో ధర్మ నిర్వహణ అంటే ఎదుటి వారి ప్రవర్తనను బట్టి కాక తనకు తాను ధర్మానికి కట్టుబడడం, నువ్వు అవినీతికి పాలుపడ్డావు గనక నేను అవినీతి చేస్తే తప్పేమిటి అనడం రాజ కీయాల్లో ఉండే పలాయనవాదం.

అది మన జీవితాల్లో పాటిస్తే ఎలా?

ధర్మబద్ధమైన అర్థకామాలను సంప్రాప్తింపజేసుకోవాలి అనే సంక ల్పం కల వారెవరికైనా పాతివ్రత్యం అనేది హాస్యాస్పదం కాదు – ఆచరణీయం అనే అనిపిస్తుంది.

మనం ఎంచుకొన్న రెండవ శ్లోకంలో ఉన్నది ఏమిటి అంటే బాల్యంలో తండ్రి, యౌవనంలో భర్త, వృద్ధాప్యంలో పుత్రుడు రక్షణ ఇవ్వాలని స్వతంత్రంగా ఉండే అర్హత లేదని చెప్పబడింది. నేటి దేశ పరిస్థితులలో అన్వయించుకొని చూస్తే...

***స్త్రీకి ఆర్థిక స్వావలంబన ఉన్నంత మాత్రాన రక్షణలేదు అని స్పష్టమవుతోంది. చట్టాలు, పోలీసు వ్యవస్థలు స్త్రీకి రక్షణ కల్పిస్తు న్నాయా? మార్పు రావాలి, మార్పు రావాలి అని ప్రతివారు ఎదుటి వారిని అనడమే కాని, మనం మారుతున్నామా?***



నేటి ప్రపంచంలో ఏ సమాజమైనా మా స్త్రీలు నూటికి నూరు శాతం రక్షణలో ఉన్నారు అని చెప్పే పరిస్థితులున్నాయా? కుటుంబం లోని తండ్రులు, అన్నదమ్ములు, కుమారుల చేత రక్షింపబడడమనే సహజమైన, సులభమైన వ్యవస్థను కాదని ఎక్కడో ఉన్న పోలీసులు, చట్టాలు రక్షిస్తాయనుకోవడం ఎంత అవివేకం. అసలు యువతరాన్ని తయారుచేయడంలోనే మనం ఈ విష సంస్కృతికి పునాది వేస్తు న్నాం కదా!

తల్లిని గౌరవించమని చెపుతున్నామా?

తల్లిదండ్రులు తమ పుత్రులతో స్త్రీని ఎలా గౌరవించాలి అనే విషయం ఎప్పుడైనా సంభాషిస్తున్నారా? మేము మా పిల్లల్ని స్వేచ్ఛగా పెంచుతున్నాం అని బీరాలు పలుకుతూ వాళ్ళ పసితనపు స్థాయికి తాము దిగజారుతున్నారే గాని, భవిష్యత్తులో ఎలాంటి పరిస్థితి ఏ విధంగా ఎదుర్కోవాలో చెబుతున్నారా?

తల్లులకు తమ ఆడపిల్లల వస్త్రధారణ విషయంలో సూచనలిచ్చే ధైర్యం ఉందా? వాళ్ళకే అవగాహన లేనప్పుడు ఇక యువతరానికి ఏమి చెప్పగలరు?

***స్త్రీ శరీరం అతి పవిత్రమైనదని నలుగురి మధ్య ఉన్నప్పుడు కొన్ని మాన మర్యాదలు పాటించాలని, వస్త్రధారణ ప్రేరేపకంగా ఉండకూడదని యువతులకు చెప్పగలుగుతామా? అంగాంగ ప్రదర్శనతో ఆడపిల్లలు నడివీధుల్లో తిరుగుతుంటే, బజారులో ఖండఖండాలుగా మాంసాన్ని విక్రయిస్తున్నట్లు అనిపించడం లేదా? పైగా శరీర సౌందర్యాన్ని ప్రదర్శించడం తమ జన్మహక్కు అని కొందరనడం, మరికొందరు అభినందించడం శోచనీయమైన విషయం.***

పరిసరాల కాలుష్యాన్ని మించిన భావ కాలుష్యం ఈనాడు చోటు చేసుకుంటోంది.

మరీ విషాదకరం ఏమిటంటే భావకాలుష్యాన్ని తయారుచేసేవాళ్ళు కాదు దానికి బలైపోయేది. దూరంగా ఎక్కడో ఉన్న వినియోగ దారులు. ఉద్యమాలు చేసేవారు ఆలోచించగలిగినా ఆలోచించరు. కానీ అర్థం లేని నినాదాలు మాత్రం చేస్తారు.

ఇక మూడవ అంశం. సేవ చేసినపుడు దాసిలా, వ్యవహారాలలో మంత్రిగా, ధర్మబద్ధమైన కామకళలో రంభగా, పోషణలో తల్లిగా ఉండడంలో ఏది దోషం? సేవ అనేది ఎవరు ఎవరికి చేసినా అంకితభావంతోనే చెయ్యాలి. భర్తకు భార్య చేసినా, భార్యకు భర్త చేసినా తల్లిదండ్రులకు పిల్లలు చేసినా, పిల్లలకు తల్లిదండ్రులు చేసినా పైన చెప్పినవి జరుగకపోవడం వల్లనే వివాహ సంబంధాలు కూలిపోతున్నాయి. వేతనం వచ్చే కార్యాలయాల్లో దాస్యం చేయడానికి మనం వెనుకాడం.

మన యంత్రాంగాలన్నీ ధన సంపాదనకే వినియోగిస్తాం. మన అందాలు, అలంకరణలు ఇంటి బయటకు పరిమితం. ఇంటికి రాగానే నీరసం ముఖాలు, పాత గుడ్డలు, భోజన వేళలు ఎవరివి వారివి. ఆ సమయంలో కూడా కళ్ళు టీ.వి.ల మీద, చెవులు సెల్‌ఫోన్‌ల మీద, ఇక సంభాషణలు, సామరస్యాలు ఎక్కడివి? పురుషులు కూడా భార్య తనతో గడపడం కన్నా ఆర్థిక సంపాద నలో మునిగితేనే నయం అనే ఆలోచనలో పడుతున్నారు.

అయితే ఆత్మలు అనురాగం కోసం, ఆప్యాయతల కోసం తపిస్తూ ఉంటాయి. ఆ ఘర్షణల విభేదాలకు ఆఖరికి విడిపోవడానికి దీరితీస్తాయి. కోర్టులు, విడాకులు, చట్టాలు ఎలాగూ అందుబాటులో ఉన్నాయి. వీరి తల్లిదండ్రులూ చెప్పరు. వీరు వీరి పిల్లలకు చెప్ప డానికి ఏమీ మిగలదు.

***"ఆడపిల్లని మేం చదివిస్తున్నామండీ, ఎందుకంటే రేపు వివాహం తరువాత ఏమైనా సమస్యలు వస్తే వాళ్ళ కాళ్ళమీద వాళ్ళు నిల బడాలి కదా!" అనే తల్లిదండ్రుల సంఖ్య ఎక్కువయిపోతోంది.***

అంటే సంకల్ప స్థాయిలోనే నకారాత్మక భావాలు. ఇక ఆ యువ తుల మనసుల్లో ఎలాంటి ఆలోచనలు వస్తాయి?

పురుషునికైనా, స్త్రీకైనా విద్యాజ్ఞానం కోసం కేవలం ఆర్థిక సంపా దన కోసం కాదు. స్త్రీల అభ్యుదయం పేరుతో ప్రవేశపెట్టిన ప్రభుత్వ

పథకాలు ఎంత విపరీతమైన ఆలోచనా ధోరణులకు దారితీస్తు న్నాయో సూచించే ఒక ఉదాహరణ చూద్దాం.

ఉద్యోగంలో ఉన్న పురుషుడు మరణిస్తే అతని భార్యకు సముచిత ఉపాధి చూపించాలనేది ప్రభుత్వ పథకం. ఒకానొక సందర్భంలో చాలా అమాయకంగా అన్న ఒక బాలిక మాటలివి.

"నేను చదువు మానేయవలసి వచ్చింది. మా నాన్నగారు రిటైరైన నెల్లాళ్ళకే చనిపోయారు. మేం ఇబ్బందుల్లో పడ్డాం. ఆయన ఒక్క నెల ముందు పోయి ఉంటే హాయిగా మా అమ్మకు ఉద్యోగం వచ్చి నేను చదువుకోగలిగే దాన్ని!" మనం ఎటు వెడుతున్నాం? ఇదా అభ్యుదయం! వీటి కోసమా పోరాటాలు, ఉద్యమాలు? ఈ భావ కాలుష్యాన్ని భరిస్తూ పోవడమేనా?

అవసరం లేదు. విజ్ఞతతో ఈ విషయాలన్నీ ఛేదించవచ్చు. శారీరక, మానసిక, నిత్యమైన, సత్యమైన ఆనందాన్ని స్త్రీలు మరలా సాధించ వచ్చు. ఈ పోరాటం వ్యక్తి స్థాయిలోనే సాధ్యం. యువతీ యువకులకు నేడు కావలసినది విద్యాలయాల్లో "Sex Education" కాదు.

వ్యక్తిగత స్థాయిలో విచారణ. దీనికి తల్లిదండ్రులు, గురువులు బాధ్యత వహించాలి. ఈ శరీరం ఎందుకు ప్రాప్తించింది? దీనితో పొందదగినది ఎటువంటి అనుభవం? ఏ అనుభవం ఎలాంటి ఫలితానికి దారి తీస్తుంది? స్త్రీ పురుషులకు మధ్య ఉండే ఆకర్షణల ఆరంభం, అంతం ఏమిటి?

ధర్మబద్ధంగా ఆకర్షణను శాశ్వతమైన అనుబంధంగా మార్చు కోవడం ఎలా? అధర్మపు ఆలోచనలను నియంత్రించుకునేదెలా? ఇలాంటి విషయాలపై ఏ తల్లిదండ్రులైనా అవగాహన కలిగిస్తు న్నారా? తాము ఆచరించి చూపిస్తున్నారా?

ఏ చదువు లాభదాయకం, ఏ వృత్తి లాభదాయకం, ఎలాంటి వ్యక్తిని వివాహం చేసుకుంటే లాభదాయకం, వివాహం విచ్ఛిన్నమైతే ఎలా వదిలించుకునే మార్గం వెతుక్కోవడం - ఇవా యువతరానికి మనమివ్వవలసిన సలహాలు, సూచనలు.

ఆధునిక పరిశోధనలెన్నో మన భారతీయ సంప్రదాయాల వెనుక ఉన్న శాస్త్రీయతను వెల్లడిస్తున్నా, ఆ పరిశోధనా ఫలితాలను సామా న్య ప్రజలకు అందించకపోవడం వల్ల మనం ఎంత కోల్పోతున్నామో ఈ ఉదాహరణ సూచిస్తుంది.

విదేశాలలో మహిళా నేరస్థుల మీద కొన్ని సామాజిక పరిశోధనలు జరిగాయి. తత్ఫలితంగా బయటపడిన వాస్తవం ఏమిటంటే ఆయా నేరాలు చేసిన సమయంలో చాలామంది స్త్రీలు వారి వారి నెలసరి ఋతుస్రావ సమయాల్లో ఉన్నారట. ఆ సమయంలో ఆందోళన, అలసట, ఆవేశం, విద్వేషం వంటి సహజ శారీరక స్థితులు వారిని

ఆ నేరానికి ప్రేరేపించాయట. అలాగే ఉద్యోగినులైన మహిళలపై జరిగిన అధ్యయనాలలో బయటపడినదేమిటంటే సరిగ్గా వారు అదే శారీరక పరిస్థితులలో ఉన్న సమయాలలో కార్య నిర్వహణలో పొర పాట్లు ఎక్కువగా చేయడం తోటి ఉద్యోగులతో ఘర్షణలకు దిగడం జరుగుతున్నదట.

నెలలో స్త్రీకి 'మైల' అని విమర్శించబడే విశ్రాంతిని కలుగజేసిన మన సంప్రదాయం గుర్తుకు రావడం లేదూ. ఆ సమయంలోవారు వండిన ఆహారం భుజించడం వలన, వారితో సంపర్కం వలన పురుషుడు శారీరకంగా, మానసికంగా బలహీనుడైపోతాడని మన శాస్త్రాలు ఏనాడో ఘోషించాయి.

స్త్రీలంతా గుండెమీద చెయ్యి వేసుకొని ఎవరికి వారు సమాధానం చెప్పుకోవలసిన అంశమిది.

**ప్రకృతికి ప్రతిరూపమైన స్త్రీని స్త్రీగానే గుర్తించాలి. పురుషులతో సమానత అనేది రాజకీయ, ఆర్థిక రంగాలకు చెందిన ఉద్యమ నాదం మాత్రమే. పురుషునితో ఆమెకు ఉన్నది వైవిధ్యం మాత్రమే. వైరుధ్యం మాత్రం కానేకాదు.**

ఆమెకు విశ్రాంతి అత్యవసరమైనప్పుడు ఇవ్వకుండా ఆదివారం నాడో, క్రిస్మస్‌నాడో సెలవిచ్చారు కదాని అంటే ఎలా? ఆ సెలవు రోజున స్త్రీ ఎంత మాత్రం విశ్రాంతి తీసుకోగలదో మనందరికి తెలుసు.

***పండుగలు వచ్చాయని, పెళ్ళిళ్ళు వచ్చాయనీ, ఇచ్ఛవచ్చినట్లు ఔషధ ప్రయోగాలు చేస్తూ ఆమె శ్రమను దోచుకుంటూ, బిడ్డలు ఇప్పుడు కావాలా నాలుగేళ్ళ తరువాతా అనే నిర్ణయానికి ఆమె శరీరాన్నే బలిచేస్తూ, ఆడ పిండాన్ని ఉంచాలా, తీసివేయాలా అనే 'హైటెక్' నిర్ణయాలకు మళ్ళీ ఆమెనే భౌతికంగా బలిపశువును చేస్తూ, దీనికి ఆధునికత అనే పేరు తగిలించే మనకు స్త్రీ వాదం గురించి మాట్లాడే హక్కు లేదు.***

స్త్రీకి, స్త్రీయే శత్రువు అనే పాత చింతకాయ పచ్చడి సామెతలు చెప్పే హక్కు మనకు లేదు. చరిత్ర చూస్తే ఏ మాత్రం విజ్ఞత ఉన్న వ్యక్తికైనా తెలుస్తుంది.

ఆయా సమకాలీన పరిస్థితుల ఆధారంగా చేసుకొని స్త్రీ, ఆ మాటకొస్తే పురుషుడి సామాజిక, ఆర్థిక అవసరాలను బట్టి తాత్కాలికంగా స్త్రీ అంటే ఇలా ఉండాలి, పురుషుడంటే ఇలా ఉండాలి అనే లక్షణాలు ఆపాదించబడ్డాయే తప్ప, సనాతన విజ్ఞానాన్ని ఆధారం చేసుకోవడం జరుగలేదు. సతీసహగమనం, బాల్య వివాహాలు, కన్యాశుల్కం, వరకట్నం, అధిక సంతానం, పరిమిత సంతానం, వితంతు వివాహాలు ఇవన్నీ ఆయా కాలాలలో సమాజాలు 'ఉత్పత్తి' చేసుకున్న విలువలే తప్ప స్త్రీకిగాని, పురుషునికి గాని 'స్వధర్మం' గురించి విచక్షణ చేసే అవకాశమే కల్పింపబడలేదు.

అన్నింటి కంటే ఉక్కిరి బిక్కిరి చేసిన అంశం "స్త్రీత్వం - పురుషత్వం" (Femininity - Masculinity).

భౌతికంగా స్త్రీలుగా, పురుషులుగా జన్మించిన వారిలో ఈనాడు పై లక్షణాలు ఆశించి వాటినే ఆధారంగా తీసుకొని వారిని మగ రాయుడిలాంటి స్త్రీ అనీ, ఆడంగివాడు అనీ అనడం హేతుబద్ధమా? సౌమ్యత, గాంభీర్యం, అలంకార ప్రియత్వం, అలంకారాల మీద, ఆభరణాల మీద విముఖత, నిర్ణయ దక్షత-అది లేకపోవడం -ఇవన్నీ వ్యక్తిగత విషయాలేగాని, భౌతికంగా స్త్రీకి గాని పురుషుడికి గాని చెందినవి కానేకాదు.

జ్యోతిషశాస్త్రం మీద అవగాహన గల ఎవరికైనా తెలుసు. జాతక చక్రంపై కుజ గ్రహ ప్రభావం ఉంటే ఒక రకమైన లక్షణాలు, శుక్ర గ్రహ ప్రభావం ఉంటే మరొక రకమైన లక్షణాలు వ్యక్తిలో ప్రతిఫలిస్తూ ఉంటాయని మన జ్యోతిష్యశాస్త్రం స్పష్టంగా చెబుతున్నది. దానికి అనుగుణంగా ఆవేశపరులు, ఉద్వేగపూరితులు, అలంకారప్రియులు, లలిత కళలపై ఆసక్తి గల పురుషులు కనిపిస్తారు. యాజమాన్య దక్షత, కాఠిన్యత గల స్త్రీలు కనిపిస్తారు. మన జ్యోతిషశాస్త్రాన్ని మూఢ నమ్మకం అని ప్రచారం చేసే వర్గాల వారే